...యై నమః.

# ...గ్యమాధవము.

...జుల రామసుబ్బారాయుఁడు, బి. ఏ.,

ప్రెసిడెంటు:

...హాలతా...ని ...సంఘము,

...ల్లాపురం.



పెంటపాడు,

...ష్ణవ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1933.



ఆరోగ్యమార్గ ప్రదర్శకులును, అస్మద్గురువర్యుల
కింకవీంద్రఘటాపంచాననులును నగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వే
శాస్త్రిగారి 'ఆరోగ్యకామేశ్వరి' యను గ్రంథము నను
చియే, యీ 'ఆరోగ్యమాధవము' నా రెండవ కుమా
డగు సుబ్రహ్మణ్యము రోగార్తిచేఁ దపించు సమయ
నారోగ్యార్థమై మాధవునుద్దేశించి స్తుతిచేయఁబడిన
గ్రంథము. ఇట్టి విపత్సమయమున వేఱుమార్గములయ
నాకు విశ్వాసము లేక కేవలము దైవతారాధనయందు
గల భక్తియును, నా గురువర్యుని మార్గమవలంభించుట
దనురక్తియును నన్నుఁ బ్రేరేపింపఁ దొలుదొల్త వ్రాయఁ
'శనిస్తోత్ర' 'ఆరోగ్య వేంకటేశ్వర రాజరాజేశ్వరి'
ముల తెలుంగుననే యీ గ్రంథమును రచించినాడను.

లీలావతారుండగు పరమేశ్వరునిచే గల్పింపఁబడిన
మాయామేయ జగన్నాటకరంగమందు తమతమపాత్రలని
సంపూర్ణముగ చిత్రింపవలసిన భారము ప్రతి మానవునికి
ధర్మమైనను, ఏతన్నిర్వాహణమును, పరిణామదశయుఁ
విధిననుసరించియే యుండునని విజ్ఞులెఱింగిన విషయమే
విశేషించి వ్రాయక నింతటితో విరమించుచున్నాఁడను.

ఇట్లు,

శ్రీమత్పరదేవతాయై నమః.

# ఆరోగ్యమాధవము.

మ. ఇదె నాప్రార్థన నాదు రెండవసుతుండెంతో రుజాక్రాంతుఁడా
పదలోనుండుటఁ జేసి, వైద్యుల యెడన్ బ్రామాణ్యమా? లేదు; నె
మ్మది ధైర్యంబొకయింత లేదు, బ్రదుకన్ మార్గమ్ము లేదింక నీ
పదపద్మంబులె నాకు దిక్కు కరుణాపారీణ! యోమాధవా! 1

సీ. ఆనాఁడు పరిసవవేదానలజ్వాలచే
మద్భార్య తపియింప మనుపలేదె?
ఆనాఁడు దీర్ఘరోగార్తిచేఁ గృశియించు
నా జ్యేష్ఠసుతు దయన్ గావలేదె?
ఆనాఁడు క్షీణించి ప్రాణాశవీడిన
పట్ల నన్నట్లు గాపాడలేదె?
ఈనాఁడు దుర్భరమైన బాధల జిక్క
టఁగలిగె నాదు రెండవ సుతుండు,

గీ. బ్రతుకఁ గలఁడంచు నాశయు వదలిపోయె
విసిగిపోతి నౌషధముల వేసివేసి
కడకు నీవ దిక్కనుచు నీగాళ్ళఁబడితి
కరుణఁ బ్రోవుమా మత్సుతుఁ గమలనాథ! 2

మ. పాపం బొక్కెడఁ దాను జేసినను గాపాడంగ రాదొక్కొ? న
న్నే పీడింపఁగఁ జేయఁగాఁ దగును జుమ్మీ! జాలమింకేల? ఏ
పాపంబుండదటంచు నీచరణమే ప్రాపంచు నేఁ బట్టితిన్
పాపంబాప్పఁగఁ జేసి కుఱ్ఱనికి మోదంబిమ్ము యోమాధవా! 3

సీ. ప్రహ్లాదుఁడానాఁడు పడెడు బాధలఁ జూచి
దయఁదాల్చి దరిఁజేర్చి దనుపలేదె?
మత్తేభమానాఁడు మకరి కోఱలఁ జిక్క
శరణిచ్చి ప్రోవవే భరముమాన్పి,
పతి శాపవశమున స్మృతిదప్పి పతితయై
న పడతిఁగావవే నయముసూపి,
ధార్తరాష్ట్రులబారి దప్పించి కావవే?
ద్రౌపది నెంతేని దయదలిర్ప,
గీ. వీరు వారని యెంచ కెవ్వారినైన
నీ పదారవిందముల సన్నియతిఁ దాల్చి
భజన చేసిన యంతఁ గాపాడ వొక్కొ?
భారమూని మత్సుతుఁ బ్రోవ నీరజాక్ష! 4

శా. ఎన్నో మందులువాడిచూచితిని నేనెన్నాళ్ళొ మేల్ వైద్యులె
న్నెన్నో భంగులయత్నమూనిరవియున్ హీనంబులయ్యెన్ గదా?
అన్నా! మానితి వైద్యసేవనిటుపై నాధారమున్ లేద; యా
పన్నుండౌ పసిబాలుఁ బ్రోవఁదగదా? భద్రమ్ముగా మాధవా!5
మ. ఇలువేల్పైన కతాన నీ చరణమెంతేనిన్ బవిత్రంబు; నీ
చలువన్ జేసియెనాఁడు సౌఖ్యమొదవెన్; సాధింప లేవా? రుజా
బలమున్ దింపుమ నాదుపుత్రుఁ గరుణింపన్ రమ్మ నీనామమే
బలమియ్యంగలదంచు నెంచి సతమున్ బ్రార్థింతునో మాధవా! 6
శా. రావే! నాసుతుఁ బ్రోవవే! విజయముల్ ప్రాప్తింపఁగాఁ జేయవే
ఈవే నాకభయప్రధాన మెటులో యెంతెంత యో వేడఁగా
నీవే? నాఁడల ద్రౌపదీసతికి నెంతేనిన్ ఫలంబట్ల న
న్నీవే రక్షణసేయఁగావలె దయన్ వీక్షించుచున్ మాధవా!7

చ. ప్రకటిత దైవయోగమున బాలుఁడు మిక్కుటమైన బాధచే
వికలత నొందుచుండె నణువీసమునైన బలంబు లేదు; శా
బకుఁడు కృశించుచుండెఁ బరువా! కృపఁజూడఁగ నిచ్చగింపవా?
సుకమును గల్గఁజేయవ, విశుద్ధమనమ్మునఁ బ్రోచి మాధవా! 8

శా. ఏ పాపమ్మును జేయ లేదు సుతు నీ వేలా? దయన్ బ్రోవవో
పాపమ్మైకడఁ జేసినన్ గృపకుఁడా! బ్రాతుండు గాఁడో? యీ
పాపమ్మున్ భరియించెదన్ వదలుమా భారంబు నాపైని నీ
శ్రీపాదాబ్జముఁ గొల్తుఁ బ్రోవుమెటులో నీరేజాక్షయో మాధవా! 9

మ. చెడురోగమ్ముదయించె బాలునకు నిన్ సేవించుటే ధర్మమం
చెడఁదన్ భక్తిని బాదుఁ గొల్పితిని నిన్నే నమ్మి కొన్నాఁడ, నే
చెడుగున్ గూర్పఁగఁ బోక నా సుతుని సుఖాశీర్యుక్తుఁ గావించుచున్
బడయన్ జేయుమయాయురభ్యుదయ సౌభాగ్యంబులో మాధవా

మ. కొడుకీ రీతి దురంత వేదనలచేఁ గోడొందిగూపెట్టఁగా
నెడఁదన్ సౌఖ్యమదెట్లు గల్గు? హితమే యేరీతిఁ బ్రాప్తించు? న
న్నడలన్ జేయక సాయమిచ్చి కృపతో నాలింపుమా మత్సుతున్
దడబాటుం గలుగంగనీయకుము మోదంబిమ్ము యో మాధవా! 11

శా. తగ్గున్ రోగబలంబటంచు నిటు పద్యాల్ సెప్పఁగాఁ బూనితే
తగ్గన్ గప్పడదెంతమాత్రమనుచున్ దర్శించు మద్బుద్ధి; బల్
సిగ్గున్ జెందితిఁ జేయు కార్యమెదియున్ లేదాయె నీ వెట్టులో
నగ్గన్ జేయుము మత్ప్రయత్నముఁ గని నిన్నే నమ్మితిన్ మాధవా! 12

శా. "ఆలస్యాదమృతవిషం" బసిగదా యారోగ్యోక్తి యట్లైనచోఁ
బాలున్ రక్షణసేయుటొప్ప నిపుడే వర్ధిష్ణుఁగాఁ జేయుచున్
బాలన్ ముంచిన నీట ముంచిన సరే భారంబు నీదే సుమీ
పాలింపం దగువార లెవ్వరిఁక దేవా! మమ్ము నో మాధవా!

శా. ఎన్నండీచెడురోగముల్ విడుసుతుండెన్నండుదానాడు, నా
కెన్నండబ్బుసుఖంబు మత్సుతుఁడునింకెన్నండునారోగ్యసం
పన్నుండై తనరారుఁ జెప్పు మిపుడే ప్రార్థించుచున్నాఁడ నీ
కన్నన్ వేఱొక దిక్కు నాకుఁ గలదా? కాపాడవా మాధవా!
శా. ఏనాఁడేది భవత్కృపన్ దొఱకునో హెచ్చైనభాగ్యమ్ముగా
నేనెప్డున్ దలపోయుచుందునదియే; తృప్తిన్ వహింతున్ గదా
దేనిన్ గోరిత్తగ వేఁడ మత్సుతునియార్తిన్ బాపుమోతండ్రి! యా
పైనీచిత్తము నాదుభాగ్యమనుచున్ బ్రార్థించితిన్ మాధవా!
ఉ. మందులు మానివేసితిని మావలనన్ దగుయత్నమేమి? యే
చందమునన్ సుతుండు మనఁజాలు? నీకేది యొనర్పలేక ని
న్నుందగ వేఁడుకొంటిమి మనోబలమున్ గృశియించెనింక బా
లుందయఁబ్రోవఁగాఁదగదె? లోపములెంచఁగఁబోక మాధవా!
శా. ఆరాధించుటలేదె నిన్నదనిరాహారుండనై దీక్షతో
నేరాత్రింవిడకుండ; భాగవతమంతేనిన్ బఠింతున్ గదా
కారుణ్యామృతమింత జిల్కి యెటులో గాపాడుమో తండ్రి నీ
వేరాణించెడుత్రోవఁ జూపవలె నిన్నే గొల్తునో మాధవా! 17
మ. పరులన్ బాధలుపెట్టుచుంటినొ? కృపన్ బాటింపకేయుంటినో?
పరుసంబుల్ వచియించి పెద్దలను సంభావింపఁగాలేదొ? నీ
చరణారాధనమూనలేదొ? సుతుపై సాధింపఁగా జెల్లునే?
కరిరాజున్ గృపఁగాచినట్లుసుతునిన్ గాపాడుమో మాధవా! 18
శా. ఏవోమందులు వేసినాఁడ నెద నిన్నే దిక్కుగా నమ్మి నా
భావంబందు నధైర్యమెంతయును నిల్పన్ గానశక్తుండనై
భావింపందగదింక నాదోసఁగులన్ బాలున్ దయన్ జూడుమా
నీవేకాక మఱేదిదిక్కు చెపుమా నిక్కంబుగామాధవా! 19

శా. నాచాంచల్యము లెంచఁబోకు మెటులో నాపుత్రునిం గాచి నా
వాచాదోషములున్నచో నవి క్షమింపన్ జేసి శిక్షించి నీ
వేచందమ్మున నైనఁ బ్రోచు నెడ నీ కేపుణ్యమబ్బున్ గదా
నీచేఁ గానిదొకం డుగల్గునె? కృపన్ వీక్షింపు మోమాధవా! 20

శా. ఈరోగంబెటు మాను బిడ్డనికి నీవే చెప్పు కారుణ్యమే
పారన్ జూడుమ పుత్రభిక్షనిడుమా ప్రార్థించుచున్నాఁడ నా
యారాటంబుఁ ద్యజింపఁ జేయుమిఁక నత్యంతమ్ము సద్భక్తితో
నా రాధించుచుంటి పుత్రునకు సౌఖ్యం బిమ్మయో మాధవా! 21

శా. నీకారుణ్య మొకింత నాసుతుపయిన్ నిల్పంగనున్నంత న
స్తోకంబైన సుఖాయురున్నతులచే శోభిల్లు నత్పుత్రుఁడున్
నాకున్ మోదము సంఘటించు నిను విన్నాణంబుగాఁ గొల్చెదన్
నీకన్నన్ బర దైవమేది చెపుమా నిక్కంబుగా మాధవా! 22

శా. బాలుం డేడ? మహారుజార్తిఁ దపియింపన్ గల్గఁగా నేడ? హా
జాలింబూనుమ పుత్రరత్నము నెటో సాకం బ్రయత్నింపుమా
పాలన్ ముంచిన నీట ముంచినను నీపాదంబె దిక్కంచు ప
ద్యాలన్ నీపయి వ్రాసినాఁడ దయతో నాలింపుమా మాధవా! 23

శా. నా మాతృ త్వమదృశ్యవుఁ డీమహారుజల చేనల్గంగ దాశల్యమై
యామాయాసమ్ము నొందెందు చుండెనకటా! యాలస్యమిం కేటికో?
నీయుద్దేశ మెఱుంగ భారమిడితిన్ నీపైని బ్రోవంగ నీ
సాయంబున్న నికేల గల్గుభయముల్ సర్వేశ్వరా మాధవా! 24

మ. ఇతరోపాయ మొకింత గన్పడదు నిన్నే నమ్మితిన్ దండ్రి! మ
త్సుతు నారోగ్యము దెట్లు గల్గునను చున్ దూపిల్లుచున్నాఁడఁ బై
నితికర్తవ్యము నీపదాబ్జభజనం బేయుంచు నీరీతి సం
స్తుతి సేయన్ దొరకొంటి బ్రోవు మెటులో జోహారులో మాధవా! 25

మ. అతిథుల్ వచ్చినగౌరవోన్నతులచే నత్యాదరంబీయనో?
యతిపూజ్యుండవటంచునిన్ను నెదలో నత్యంతమున్ గొల్వనో?
యతిభోగమ్మున గర్వమింతగలదో? యుర్వింబెతప్పున్న నా
సుతునిన్ బాలుని వేచనేల? దయతో శోధింపుమా మాధవా!26

శా. బాలున్ జూచినవారలెల్లకరుణన్ బాష్పంబులన్ విడ్చుచున్
జాలిన్ జెందుచునున్నవారలు రమానాథుండె దిక్కంచు నీ
వేలిలన్ బ్రిసరింపఁజేతువో కృపన్ వీక్షించి రక్షింప నిం
కేలా? జాగొనరింతువిట్లుబరువా? యీ మాత్రమో మాధవా!27

శా. బాలున్ శుష్కశరీరుఁగన్నసుతునిన్ బాయంగలేకక్కటా!
నేలన్ గూలుచు బాష్పపూరములచే నేలంటకద్దమ్ములన్
వాలిలన్ జేసి తపించుగుండెపగులన్ మద్భార్యదుఃఖంబుచే
వేలిలాడంగ నిఁకెప్డుగల్గుఁ గరుణావిర్భావమో మాధవా!28

శా. ఆర్తింజెందిన కారణమ్మునఁ గదా యాచింతునీరీతి రో
గార్తింబాపుమ మస్తుమారునకు సంప్రార్థింతు నాకోర్కెలన్
బూర్తింజేసి సుఖింపఁజేతువనుచున్ లోనెంతు నారోగ్యవి
స్ఫూర్తింగల్గగజేయుమా సుతునికిన్ మోదమ్మగున్ మాధవా!29

శా. భక్తిన్ బ్రార్థనసేయుచుంటి నిటులన్ బద్యంబులేదిక్కు నా
వ్యక్తిన్ మార్పఁగలేను నీవెఱుఁగవో ప్రార్థింపఁగా నిట్టులా
సక్తిన్ మున్నొకసారి నీవొసఁగవో సౌఖ్యమ్ములన్ రోగని
ర్ముక్తిన్ జేయుమమత్తుమారునకు నా మోదమ్మగున్ మాధవా!30

శా. నీపైనన్ గల భక్తిభావములచే నిర్మించితిన్ బద్యముల్
నాపై నీవటులే దయన్ జూనుపఁగా న్యాయంబు నాపైని నీ
పాపిపున్నన్ గదయెట్టి యత్నములు సేయంగా ఫలంబబ్బు నీ
ప్రాపున్ గాంచనివారికెట్లు జయమబ్బన్ గల్గునో మాధవా!31

ఉ. వీసముగాని లేక యాఱువీసము నైనను దాచఁకుండ నే
జేసిన పాపముల్ దెలియఁజెప్పితిదప్పక నొక్కటైననుఁ
దోసము లెంచఁబోక మము దూరము సేయక నీకృపారతిఁ
భాసిలఁ జేసి పుత్రినకు భద్రమొసంగుము వేగమాధవా!32

మ. వ్రతముల్ సత్తపముల్ జపంబులును సద్భక్తిఁ బిసాళించి స
మ్మతిఁ జేయంగలశక్తిలేక యిటు లేపద్యాళితోఁగొల్చు ప
ద్ధతినభ్యాసము చేసినాఁడఁదొలుదొల్తఁ మత్సుతుఁ బ్రోవుమీ
గతినైవార్చనకున్ బ్రయోజనమగున్ గాదొక్కొ యోమాధవా33

సీ. రక్షింపు రక్షింపు రక్షింపు మనువారి
నెప్డైన దయను రక్షించి తేని
శరణు జొచ్చినవాని సాకుట రాజ ధ
ర్మమనుచు లోనెంచు ప్రభుఁడ వేని
దీనావనుఁ డను సత్కీర్తిఁగాంచిన యట్టి
సత్కార్యమెప్డైన సలిపి తేని
నీకాళ్లపైఁబడి నీవదిక్కని గొల్చు
పగవానినైన చేబట్టి తేని

గీ. నిన్ను నమ్మి భజించిన నన్ను నేలఁ
గావకుందువు ? కృపఁదాల్చి దేవదేవ !
నీకటాక్షము నాపైన నిలుపరాదె ?
పాపమున్నను క్షమియింపఁ బాడిగాదె ? 34

శా. నీకారుణ్యము కల్మి నాసుతునకున్ నీరోగమున్ జేయుచోఁ
పైకిన్ గుఱ్ఱఁదురాఁగలండటయినన్ బ్రాణమ్ములన్ నీదయా
ప్రాకట్యమ్మునఁ గాంచెనంచు నెదసంభావింతు నిన్నెప్పుడున్
నాకున్ సౌఖ్యముగల్గు నీవలననే నాతండ్రి యోమాధవా!35

శా. దీక్షన్ బట్టి జపించుచుంటి ననుర క్తిన్ బూని మత్పుత్రునిన్
రక్షింపంగల శక్తిలేదె? మఱువన్న్యాయంబె? తప్పున్నచో
శిక్షింపన్ దగు నీకునర్భకునిపైఁ జెల్లింపఁగాఁ జెల్లునే?
సాక్షాత్కల్పక మీవుప్రోవుమెటులో జాగేలయో మాధవా! 36

ఉ. నీదయచేతఁ గుఱ్ఱనికి నెమ్మదిగల్గునటంచు నెమ్మదిన్
మోదముఁ జెందుచుంటిమునునోచినపుణ్యము దెట్లులుండినన్
గాదనఁబోక నీదుపదకంజముఁబట్టితిఁ గాన నూరకే
పోదు భవత్కృపారసముపూర్తిగ జిల్కవ వేళ మాధవా! 37

ఉ. శ్రీయముగల్గఁదప్పదని చిత్తముప్రేరణసేయఁ బద్యముల్
వ్రాయుచు నీపదాబ్జముల వ్రాలితి దీనుఁడనంచు వేఁడితిన్
బాయనిప్రేమతత్పరత బాలునిబ్రోచితి విఘ్నమింక దీ
ర్ఘాయువొసంగిజీవితమునందుసుఖంబొనగూర్చు మాధవా! 38

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

---

శ్రీ.

మ. అపరాధంబు క్షమింపుమమ్మ జననీ! యానందసంధాయినీ
కపటంబెంతయు లేక నీచరణముల్ కంజాక్షి! నేబట్టితిన్
జపమున్ జేయుచునుంటినిన్ను సతమున్ సద్భక్తితోఁగొల్చుచున్
గృపఁబ్రోవంగదె మత్కుమారు నెదఁదల్లీ! రాజరాజేశ్వరీ!

వాజపేయయాజుల మహాలక్ష్మి.

---

# ఆశీర్వచనములు.

శా. శ్రీమూర్తిత్రయమూలమూర్తియగుచున్ క్షేమంకరుండై ఘ
నుం, డై మేలందెడు భాస్కరుండు కరుణాస్వాంతంబువర్వన్ జగ
త్స్వామిత్వంబున వాజిపేయకుల సుబ్రహ్మణ్యనామార్భకున్
బ్రేమంబ్రోచుత మామయంబుడుఁగఁగా బేర్మింబ్రతిష్ఠించుచున్.

బ్రహ్మశ్రీ, కవిసార్వభౌమ, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.

---

శా. శ్రీకల్యాణ పరంపరాది సకల శ్రేయంబులంగూర్చి యా
స్తోకం బాయువొసంగి గండమునొగిన్ దూరమ్ముగానెట్టి భ
వ్యాకారున్ బొనరించి ప్రోచు శివు శుద్ధాంతంబు కామేశ్వరీ
రాకాబ్జాస్య కృపారసార్ద్రి మనసుబ్రహ్మణ్యన బ్రమ్ముగన్.

బ్రహ్మశ్రీ, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు,
శతావధాని.

---

సీ. కల్వంబులనుపోసి కరము నూరని మందు
శ్రీహరి చరణాబ్జ సేవనంబు
శ్రద్ధనుబూని కాచని మేల్ కషాయంబు
శ్రీహరి చరణాబ్జ సేవనంబు
వేమారు పుటములుబెట్టని భస్మంబు
శ్రీహరి చరణాబ్జ సేవనంబు

భాండంబులనుబెట్ట వండని లేహ్యంబు
శ్రీహరి చరణాబ్జ సేవనంబు

గీ. పావనౌషధ మచ్యుత సేవనంబు
నట్టి మందును సేవింపుమయ్య నీవు
బ్రతుకఁ గలఁడు సుబ్రహ్మణ్య బాలకుండు
హరికటాక్ష వీక్షణముల నందుకొనుచు. 1

గీ. రోగి సేవించునేని నారోగ్యమిచ్చు
నతని కితరౌషధంబు లద్భుతముగాఁగ
తల్లిదండ్రిలు సేవింపఁ దనయుల కిడు
హాయి శ్రీహరిపద సేవ నౌషధంబు. 2

ఆ. గీ. అడవి చెట్లనెల్ల నరసికాచెడువాఁడు
పుట్టలోని చీమఁ బ్రోచువాఁడు
ఱాతిలోని కప్ప బ్రతుకఁ జేసెడివాఁడు
నీ కుమారుఁ గావలేకపోఁడు. 3

క. సేవింపుము నారాయణు
జీవించును నీ సుతుండు చిరకాలంబుౕ
దీవించితి నీరీతిని
నీవంతలు బాయునింక నిర్మల హృదయా. 4

డాక్టరు, బ్రహ్మశ్రీ, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు,
ఆంధ్రసాహిత్య చక్రవర్తి.

చ. సుజనవరేణ్య ! రామపదశోభిమనోంబుజ ! వాజిపేయయా
జి జననసంభవా ! గుణవశీకృతకోవిద ! రామసుబ్బరా
యా! జగదభీష్ట! నీకుశుభమయ్యెడి నీదుకుటుంబమంతయుఁ
స్వజనముగందలంచిరఘువర్యుఁడనామయమిచ్చిప్రోచెడిన్. 1

ఆ. నిన్నఁగాక మొన్ననీవు శ్రీజానకీ
పతివి భక్తితోడఁ బద్యశతక
మునసుతించియుంటి మూర్ఖుండె యాతండు
యుష్మదిష్ట మీయకుండుటకును ? 2

చ. అరసికుఁగూర్చి చెప్పఁబడునట్టి కవిత్వము వ్యర్థమౌను గా
ని, రసికశేఖరుండు ధరణీపతి రాఘవుఁడట్టివాఁడు నీ
తరుణిని నిన్ను నీసుతులఁ దాఁ జిరకాలము మన్పలేడె ? న
ల్వురినెభరింపలేనపుడు భూభరమింక నెటుల్వహించెడిన్? 3

ఆ. ఏల నీకుఁ బిచ్చి ? యీల్గిన ద్విజబాలు
రక్ష చేసినట్టి రాముఁడేమి ?
భక్తుఁడైన నీదుపట్టి సుబ్రహ్మణ్యుఁ
డొందు బాధయుడుపకుండుటేమి ? 4

ఉ. నీదు హృదబ్జమందెకద నిచ్చలు రాఘవుఁడుండుచుంట! త
ద్బాదయుతాగ్రమందెయుల పుత్రకునింబడవైచి యద్దుమీ
బాధమతెంతకాలమని వైశమనామయ మేల యీఁడో యాం
మీఁదటఁజూచికొందము సుమిత్రమ! యేటికిఁజింతనీకిఁకన్? 5

బ్రహ్మశ్రీ, జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు,
ఎడిటరు, అభినవసరస్వతి.

గీ. మిత్రమా ! నీదు రెండవ పుత్రుఁ డెలమి
నాయురారోగ్యవంతుఁడై యలరునయ్య
ధైర్యమీడక దైవముఁ దలఁపుమయ్య
చిన్నిసుబ్బన్న భువి చిరంజీవియయ్య. 1

మ. వరమేశుండు దయార్ద్రభావమున సౌభాగ్యంబు చేకూర్చి న
ల్లరయున్ వచ్చి యనేక భంగులను భక్తాళిన్ బరీక్షించు నీ
సరణిన్ నేర్చిముదోద్ధతిన్ భవముపుచ్చన్ గల్గువాఁడే సుధీ
వరుఁడీయాంశము నీవెఱుంగనిదె సుబ్బారాయధీమన్మణీ! 2

శా. ధైర్యమ్మున్ ద్యజియింపఁబోకు మివిపద్భారమ్ము ధీరాళిధీ
చర్యన్ నిగ్గునఁ దేల్చు కష్టసహనాచారమ్ము గల్గించుఁ బెన్
మర్యాదన్ ఘటియించు నిష్టతమసామగ్రిన్ ద్యజింపన్ మహా
ధైర్యమ్మిచ్చుఁ దదార్జనమ్మె భవసార్థక్యమ్ము మిత్రాగ్రణీ! 3

మ. ధరణీదేవత కేలుమోడ్చి కవితోద్యత్సంఘసంధాత దు
ర్భరచింతాతురుఁడయ్యె సత్కవులకున్ భావంబులున్ మ్రగ్గె స
త్కరుణారీతినొసంగినట్టి సుతుఁగుందంజేయఁగానేల ? యీ
శ్వర! లోకంబులు సంతసిల్లునిఁక సుబ్రహ్మణ్యుఁగాపాడుమా

బ్రహ్మశ్రీ, జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,

సహస్రావధా.

# సుతస్మృతి.

---

చ. ఎవరిటు పాపకర్మమున నేడ్వఁగఁ జూచుచు నవ్వినారమో ?
యెవరిటుదుఃఖజాలమున నీఁదఁగఁజూచి సహించినారమో?
యెవరినిఁదూలనాడితిమో? యీర్ష్యవహించిమఱెట్టిదుష్కృతుల్
భువినొనరించినారమొ? విముక్తములౌనెమహాపరాధముల్. 1

మ. కలముం బట్టి రచించు నీవు కరమా! కాష్టంబులోఁబెట్టి నా
వలపుత్రుం బసిబాలు నెట్టు లకటా! యీవేశముం గొల్పుచ
ర్యలఁ జేయంగ సహించినావొ? కృపశూన్యంబయ్యెనో లేక యి
ట్టులెనాజీవితముం ముగింపవలెనో? డుల్లుం గదావ్యర్థమై. 2

కొడుకా! నీకయి బెంగపెట్టుకొనుచున్ గోడొందిగూపెట్టుచున్
విడిపోయెం గదనీఋణంబనుచునిం వేమారుధ్యానించుచుం
బడిపోయెం గద పుత్రరత్నమనుచుం భావించి భారంబుతో
నెడఁదం గుందును నీదుతల్లియకటా! యేగంగనెట్లోపితో. 3

మ కొడుకా! యిందునునందునన్ గలుగు నాకుం మేలునీవల్ల నం
చెడఁదం గాంచినసంతసంబుతుదకెంతేనిన్ వృథాయయ్యె నేఁ
బడుకష్టంబు ఫలింపదయ్యె ఘనమౌ ప్రారబ్ధకర్మంబు చేఁ
బుడమిన్ నోఁచిననోముకొంచెముగదా మోక్షంబెటుల్ గల్గెడిం.

శా. ఎన్నోకష్టములొంది పెంచితిమి రెండేండ్లీధరం నిన్ను నో
యన్నా! నీఋణమెద్దియౌననుచున్ స్వాంతమ్మునందెంచితే?
విన్నాణంబగు నాటపాటలనుచుం వేమారు వీక్షించుచున్
కన్నుల్ దుష్టములయ్యెఁగాని యెడలన్ గన్పింపవా పుత్రకా. 5

ఉ. నాకొఱకై తపించితి మనమ్మునఁ గన్నుల విప్పిచూచుచున్
బ్రాఁకుచువచ్చి కంఠమును బట్టితి గట్టిగ గౌఁగలించుచున్
నాకిడు ముద్దులన్నియును నాయన! వ్యర్థములయ్యె నింతలో!
నీకయి బెంగఁగాంచిధరణిన్ గృశియించెదనిట్లు పుత్రికా! 6

ఉ. నీకొఱకై జపంబులను నిచ్చలు సల్పితి దీక్షఁబట్టి యా
స్తోకబలాయురున్నతులతోఁదులఁదూఁగుదువంచుఁబండితుల్
నీకిడినారు దీవనలు నేనటుకోఁఱగ మృత్యువింతలో
నీకయి వేచియుండుటను నిష్ఫలమయ్యెఁబ్రయత్నమంతయున్.7

మ. రతనాల్రాలెడు ముద్దుపట్టి వనుచున్ బ్రాణంబు లర్పించి నీ
ప్రతిమన్ జూచి వినోదలీలలఁ గడున్ రాజిల్లె నీ తల్లి హా!
వెతలన్ముంచి దివంబునేగితి వె? నిన్ వీక్షింపఁగా లేని దే
బ్రతుకంచున్ దపియించుచుండు మిఁక యావజ్జీవమున్ బుత్రికా!8

మ. నవమాసంబులు మోసి కన్న జననిన్ న్యాయంబె పీడంగ ని
బ్భవి జన్మించిన దాది రోగములచేఁ బొక్కంగ వేసారి పొం
దవు సౌఖ్యంబని గోసివీడితి వె? పుత్రా! మమ్ములన్ బాసి నీ
వవలన్ మోక్షపథంబుఁ జేరుటకు నై యత్నంబులన్ సల్పుచున్.9

మ. అరిగెన్ జబ్బనికొంత కాలమెటులో యానందమున్ జెందఁగాఁ
దిరిగెన్ రోగబలంబు చుట్టుకొనియెన్ దీవ్రంబుగా నాఁడు నీ
దురవస్థన్ గనలేక యేడ్చితిమి పుత్రుండేడ? రోగార్తిచే
భరమై యిట్లు గృశించు టేడ? యనుచున్ బ్రాణాశలన్ వీడుచున్.10

శా. నీయల్పాయువు నాయభాగ్యదశయున్ రెండేకమై యుండఁగా
నాయన్నా! ఫలమేమి చేయుదును? యత్నంబెంతగాఁ జేసినన్
వేయున్ గాఁబని యేమి? యౌషధములన్ శ్రీలక్ష్మణాచార్యులున్
శ్రేయంబెట్లు లభించు నాకు నిఁకఁ దండ్రీ! ప్రాప్తిలేకుండినన్.11

మ. పరమప్రీతినిఁ బెంచినారము కదా భావింప నీమాత్రముఁ
గరముఁ జిచ్చు రగిల్చి పోయితివిలోఁ గారుణ్యమున్ వీడుచున్
ధరపై వర్ధిలు వీఁడటంచు వినుతిఁ గర్వించినానింతలో
మరణంబొందుటదుఃఖహేతువనుచుఁ మాతండ్రియూహింపవా!
శా. తల్లిఁ బోలినవాఁడవౌట ధరణిఁ ధన్యుండు వీఁడంచు సం
పల్లీలావిభవంబు లందుకొనుచుఁ వర్ధిల్లు పుణ్యాంబు నీ
కెల్లప్డుఁ లభియించునంచు బుధులెంతేనిఁ బ్రసంగింపరే?
కల్లా! వాక్యము నీదుపట్లతనయా! కాలంబెటుల్ మాఱెనో. 13
శా. చాలఁ బాల్యమునందె సొంపులొలుకఁ సాగించి నీవట్లు ధా
రాళప్రక్రియ నీదులీలల గతిఁ రాణింపఁగాఁ జేయుచుఁ
వాలాయంబుగ హాయిఁ గూర్చితివి సంభావ్యంబు నీచర్య; యిం
కేలా? శోకముత్పత్తిఁగాంతు వీఁకఁ దండ్రీ! నామహానందమా! 14
ఉ. పుట్టినదాది నాకుఁ బరిపూర్ణధనంబు లభియించు భాగ్యముల్
పట్టె విశేషగౌరవము వర్ధిలుచుండెను నాఁడు నాఁటికిఁ
బట్టినదెల్లఁ గాంచనము నా విలసిల్లె నిఁకేమి లోటు? నా
కెట్టియెడఁ శ్రమఁ గలుగదించుకయైనను గాని పుత్రకా! 15
ఉ. పుత్రుఁడు వంశరత్నమని పొంగుచు నుంటిని నేఁటిదాఁక నే
మాత్రపు బెంగయేనియును మార్గొనదయ్యెను నెమ్మనమ్మునఁ
బుత్రులొకిద్దఱంచు మది మోదముఁ గల్గెడు నింతలోపలఁ
జిత్రముగాహరించితె? కనిష్ఠుని మమ్మిటు బాయ మాధవా! 16
చ. అరుదుగ నీవు వెంటఁబడి యన్ననుఁగూడి వినోదలీలలఁ
జరుపుచు నాడుకొంచును బ్రసంగములెన్నియొ చెప్పికొంచు
సుం, దరవరనారవిందము ముదంబునఁ జూపెదు నీవు పుత్రకా!
గురుతర మోక్షధామమునకుఁ సుఖమొందఁగ నిప్పుడేగితే? 17

గీ. నీదు చిత్రపటమునైన నిల్పలేదు
నిందు వేడుకఁ జూచి వర్ణించుకొఱకు
నీ విలాసగతుల శీవి నీదు చూపు
మఱపురాదింక నెన్ని జన్మములకైన. 18

ఉ. ఇచ్చట మాదుగర్భమున నేల జనింపఁగ నిచ్చగించితో?
యెచ్చటినుండి వచ్చితివొ? యిచ్చటికెట్టులవచ్చినాఁడవో!
యెచ్చటికేగు దెంచితివొ? యెవ్వరెఱుంగుదురావిచారముల్
హెచ్చగఁదాపమేలయిడి యేగితి; చిత్రములయ్యె నీగతుల్. 19

శా. ఈదుఃఖంబునకంతముండదుగదా యెంతెంతఁగా నేడ్చినన్
వేదాంతార్థములెల్లఁ జెప్పినను శీఘ్ర విన్న గీతాదులన్
వేదంబుల్ పఠియించినన్ ఋషులతో వేమాఱుమాట్లాడినన్
మోదంబించుకయైనఁ గల్గదుగదా! యూహాత్మలా వారికిన్. 20

సీ. నీనామ భజనంబు నిఖిల పాప మడంచు
ననుమాట సత్యంబు నయ్యెనేని
ఆర్తరక్షకుఁడ వీవంచు మునీశ్వరు
లాడు మాటలు నిజమయ్యెనేని
నీ హృదబ్జము నవనీతమై కరుణార
సాన్వితమయి తగి యలరునేని
భక్తకోటిని బ్రోచు భావంబు నీలోన
నించుకైనను గల్గి మించునేని

గీ. నిన్ను నమ్మి చేసిన పూజ నిష్ఫల మగు
టేమి? నిన్గొల్చుటటఁ లోపమేదియైన
కలిగెనేమొ? నాకింకేది కలదు దిక్కు?
తెలియఁ జెప్పుమా నాకింత దీనరక్ష! 21

శా. నేనీ గ్రంథము నీదుపేరున భువిన్ నిర్మింపఁగా జేసితిన్
నీనామస్మరణంబుఁ జేసెద నిటుల్ నీపైఁ గృతుల్ వ్రాసి నా
యానందంబును దీర్చుకొందు నటుపై నత్యంతముఁగల్గకు
న్నే? నీయాత్మకు శాంతిచింతిలకు తండ్రీ! మమ్మిటుల్ పాయుటన్. 22

ఓం శ్శాం శ్శాంతి శ్శాంతిః.

---

# ప్ర బో ధ ము.

వేదాంతరహస్యసారసంగ్రహ తత్వధర్మనీతి ప్రబోధనాంతర్యమును గ్రహించియు ప్రారబ్ధకర్మమనంబడు నీ యశాశ్వతశారీరకర్మ ననుసరించి యొకింత చింతింప శోచనీయము.

" సంసారసాగరం దుఃఖం తస్మాజ్జాగ్రత జాగ్రత "యను నార్యోక్తినిఁ బఠించియు మహాంధకారబంధురనిబిడంబై దారితెన్నుంగానక యీమానవశరీరము వసుంధర నెన్నియో మాయలీలలఁ దాల్చుచున్నది. సాంసారిక వ్యావహారిక బాధలెన్నియో బాపవచ్చును. కాని నైసర్గిక బాధలఁ బాపనేరితరము? ఁలాట లిఖితమున కేమార్పును లేదు. " దాటఁగవచ్చునే విధివిధానము నేరికినైన నిబ్భువిన్ " ఆహా! మానవావస్థ జననమరణాదులం దెన్నియోమార్పులను జెందుచున్నది. ఆత్మజ్ఞానికి సర్వము సమానము. " జాతస్యహిధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్యచ " అను గీతావాక్య ప్రమాణ మనుసరించి యుత్పత్తివినాశములకు శోకింపంబనిలేదు.

"సుఖదుఃఖేసమేకృత్వా లాభాలాభౌజయాజయౌ" అను నార్యోక్తి స్మరింపం దగు.

అవివేకాంధాకారమునం జరించు మూఢులకే యన్నియు పద్రవములు. వారే చీటికిమాటికిం జచ్చుచుంబుట్టుచుందురు. ఆత్మబోధజ్ఞానాలంకారునకు మరణమొక్కటియె.

అరిషడ్వర్గములం జిక్కుకొనువారి కేగతియును లేదు.

"ధ్యాయతో విషయాన్పుంసస్సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే
క్రోధాద్భవతిసమ్మోహ స్సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశోత్ప్రణశ్యతి."

అందుచే బుద్బుద ప్రాయములగు నీ తుచ్ఛశరీర సౌఖ్యములను మోహాలీలలం దగులుకొనక, రాగద్వేషములను వదలి స్థిరమై ప్రకాశించు బ్రహ్మజ్ఞానమును భక్తిమార్గమునం గను గొని ముక్తిమార్గ మెఱుంగుటయే మానవజాతికిం బ్రధాన

" జగతిం బుట్టిపుట్టి చచ్చిచచ్చి
పొరలనేల మనకుం బుట్టని చావని
త్రోవ వెదకికొనుట దొడ్డ బుద్ధి "

అట్టి జన్మమే ధన్యము :—

" ధూమేనావ్రియతేవహ్ని ర్యథాఽఽదర్శోమలేనచ
యథోల్బేనావృతోగర్భ స్తథాతే నేదమావృతమ్. "

శాస్త్రజన్యజ్ఞానము కలిగినను కామావృతమైనచో నది పరమాత్మ సాక్షాత్కారమునకై ప్రకాశింపదు. పరమేశ్వరుని లీలావినోదంబులు కడు చిత్రములు. నిశ్చల భక్తిమార్గమునఁ గాక భగవంతుఁడు తదితర మార్గములచేఁ జిక్కుట కడుదుర్లభము. తన భక్తులకే సదా కష్టము లనేకములు గల్పించుచుండును. ఇట్టి శిక్షాసూత్రమున నిల్చి, ధైర్యము వహించి కష్టముల కోర్చినవాఁడే భగవత్ప్రియుఁ డగును. అరుగరాచిన కొలఁది పరిమళమతిశయించు శ్రీచందనపుఁ జెక్కవలె కష్టములు హెచ్చినకొలఁది జ్ఞానోదయము కలుగుట కవకాశముండును. అప్పుడే జీవితతరణోపాయములను గాంచి భగవత్సాన్నిధ్యమున కరుగుటకు వీలగును. సాధారణముగా మానవులకు పరమేశ్వర నామస్మరణ జ్ఞానమే కష్టకాలమందు స్ఫురించును. అట్టి దనేక మూఢగతులం బోలియుండు. సుఖభోగముల భోగించు కాలమున భగవానుని మాటయె మఱచిపోవుట సహజము. సకల జన్మంబులందును మానుష జన్మంబు శ్రేష్ఠంబు. జీవితకాలము నిమితంబైయుండు. వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు నేయం జనదు. హరిభజనంబున రాజ్యంబు సిద్ధించు.

దేహావసానపర్యంతంబు నారాయణ చరణారవింద సేవనంబు కర్తవ్యంబు. సంసారగతుల నమ్మి చెడిపోవుట ధర్మంబు కాదు. పరమేశ్వరధ్యానము సేయుట కనేకమార్గంబులు కలవు. కవులు శబ్దధ్యానపరాయణులై ధన్యులగుచున్నవారు. కొందఱు జీవితకాలమంతయు భాగవతాది సద్గ్రంథములను బఠించి, భగవల్లీలలస్మరించి కృతకృత్యు లగుచున్నారు. మఱికొందఱు

యోగాభ్యాసముఁ జేసి చరితార్థులగుచున్నారు. విద్యుల్లతల వలె మాయమగు నీ జీవితము శాశ్వతమని తలంపరాదు. నీటి బుగ్గలవలె యశాశ్వతంబగు భోగభాగ్యంబుల నాశింపరాదు. అస్థిరములై చలించెడు ధనకనకవస్తువాహనములపై నాశయుం డరాదు. గృహారామక్షేత్రములకై పీకులాడరాదు. కలిగిన దాన తృప్తిఁబడి దయాసత్య ధర్మశౌచ మార్గంబుల నిడుచు సమస్త జీవరాసుల కాధారభూతుండగు పరమాత్ముని సేవఁ జేయుటయె ముఖ్యసాధనము.

గీ. "చేతులారంగ శివుని పూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలుగనేటికి తల్లుల కడుపుచేటు."

అను భాగవతధర్మం బనుష్ఠింపవలయు. గడచిన కాలము తిరిగి రాఁజాలదు. క్షణమైనను వృథఁబుచ్చంగ జనదు. ఇంతిమాత్రము జ్ఞానమలవడఁ జేసిన యతీశ్వరులగు నాపినతండ్రి బ్రహ్మశ్రీ సోమనాధ శాస్త్రిలవారి కే నెంతెయుఁ గృతజ్ఞుఁడను. ఆ అస్మద్గురువర్యుల కృపాకటాక్షమున మఱికొంత భక్తిజ్ఞానము వడఁ జేసుకొను కవితా ధనమొకింత నాకు లభించె. అందుపైన సంసారకూపంబున నిక్కట్టులు నెక్కుడుగఁ జిక్కుకొన్న సమయంబునఁ బరమేశ్వర ధ్యానమే శరణ్యమనియు నారోగ్య మార్గమునకై భగవానుని స్తుతించుటచే నట్టి చిక్కులను బాపు ననియు నస్మద్గురు ముఖ్యులగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు బోధించుచు నారోగ్యమార్గప్రదర్శకులైరి. వారి కుమా

రున కారోగ్యము తప్పినప్పుడు "ఆరోగ్యకామేశ్వరి" అను స్తోత్రము వ్రాసి తుదకు, కుమారుని ఆరోగ్యవంతునిఁ జేసు కొనిరి. మనపూర్వులును,

"పూర్వ జన్మకృతం పాపం వ్యాధి రూపేణ బాధతే
తచ్ఛాంతి రౌషధైర్దానైర్జపహోమ సురార్చనైః"

యని సురార్చనము కడపటి సాధనముగ వ్రాసియుండ మా పరమగురువులును దానికే ప్రాధాన్య మిచ్చిరి. అస్మద్గురు వర్యులవలె నేను నిరాఘాటపాండిత్యంబును నిరర్గళవాక్సిద్ధి యును గల్గినవాఁడను గాకపోయినను గురుమార్గమవలంభించుట శ్రేయమని తలంచితి. నాగురువులును నన్నట్లే ప్రోత్సహించు చున్నవారు. ఇంతకుముందు సతీసుతులతో నేనారోగ్యముఁ దప్పి దీర్ఘరోగార్తిచేఁ దపియించు సమయమున "ఆరోగ్య వేంకటేశ్వర రాజరాజేశ్వరీ శతకములు" ను "శనిస్తోత్ర నక్ష త్రమాల" యను చిన్ని గ్రంథంబును రచియించి గురువర్యుల యాశీర్వాదంబులం బడసి, భగవదనుగ్రహమువలన మేముంద రమును సుఖముగ నున్నవారము. ఇప్పుడు సుబ్రహ్మణ్యమను నారెండవ కుమారుఁడు రోగబాధలచేఁ జిక్కుచుండ, "ఆరో గ్యమాధవ" మను గ్రంథంబును వ్రాసితి. నైసర్గికమహాత్త్వ తత్త్వరహస్య స్వరూపముల నెఱింగిన కవిమందారులు భాషా గురువులు కనుక కవియనువానియందును గవివాక్కునందును నాకెక్కుడభిమానము. విశేషించి పెద్దల యాశీర్వాదమునందు నాకభిమానము మెండు! కావున నాసుతుఁ డాపద్దశలో నున్న వాఁడనియు, పద్యరూపమున దీవింపుఁడనియు నేను బ్రార్థింప

నాగురువులును కొందఱు మిత్రులును నాశీర్వాద పద్యములను బంపిరి. నాసుతుఁడు క్రమముగఁ గొన్నిదినములవఱకు నారోగ్యదశలోనికి వచ్చుచున్నాఁడని నాకు నమ్మకము కలిగినది.

నేనును దానములనియు, జపములనియు, వ్రతములనియు నిత్యాదిపుణ్యకార్యముల శక్తిఁగొలఁది చేయుచునే యుంటిని. ఇట్లు రెండుమాసములు గడచినవి. దైవతారాధనమందు నాకుఁ గల నమ్మకముచే రమారమి 15 దినములవఱకు నౌషధమిచ్చుట మానితిని. గురువర్యుల యాశీర్వాద పద్యములు ఫలించినవని గర్వించుచుంటి. నామిత్రులందఱును నాశ్చర్యపడి నన్నుఁ బ్రశంసించుచుండిరి. దైవము నాయందుండి కుఱ్ఱవానిని రక్షించెనని పలువురు చూచినవారలెల్ల నబ్బురపడిరి. మంచమున నంటిపెట్టుకొని యున్నవాఁడు తిరిగి లేచి యథాప్రకారముగ నన్నము కూడఁ దినుచు, తనకుఁదానె కూర్చుండుటకు మొదలుపెట్టెను. ఇట్టి మార్గములోనికి వచ్చినసమయమున నాపురాకృతపాపకర్మమువనో తన కల్పాయు వగుటచే తనో రోగము తిరుగఁబెట్ట నార్పఁదీర్పఁగాని శోకాగ్నిలో మమ్ముల నుంచి నాసుతుండు దివంబున కరిగె. ఇట్టి శిక్షాసూత్రమున కిదియు ప్రప్రథమప్రహారమైనను పైతృత్వజ్ఞానమును రించి యెట్టులో ధైర్యముఁ జిక్కఁబట్టుకొని మానవత్వముఁ గొంచెము చలించినను మౌర్ఖ్యముగ శోకించుటలేదు.

“ పోదు దేహాభిమానంబు మునులకైన ”

అనునట్లు సంసారసాగరమున నున్న నాకు విజ్ఞాన మెక్కడనుండి వచ్చును ?

సర్వయత్నములు నిష్ఫలములైనవని నేను నిశ్చయముగ వగచుట లేదు. అనుభవమునఁగాని విషయపరిజ్ఞానమేదియును చక్కఁగ నేర్పడదు. గ్రంథరాజములఁ బరిశోధించినంతమాత్రమునఁ జక్కని జ్ఞానమలవడిన దనుట కవకాశము లేదు. శిక్షచేతనుగాని విద్యచక్కఁబడదు. పదును పెట్టినఁగాని కత్తిశోభిల్లదు. దివ్యజ్ఞానమేర్పడుటకు మానవులకు సర్వవిషయములును అనుభవములై యుండవలయునని నానమ్మిక. భగవల్లీలలు కడు చిత్రములని చెప్పియుంటిని. పరమేశ్వరుఁడు దయామయుఁడుగదా. ఆత్మజ్ఞానమెఱింగిన విజ్ఞానధనులు దీనికై శోకింపరు. ఈ కష్టసుఖములు భౌతిక శరీరసంబంధములైనవి కాని ఆత్మనెంతమాత్రమును స్పృశింపవు. ఆత్మ నిత్యమైనది. దానికెచలనమును లేదు.

"నైనంఛిందంతిశస్త్రాణి। నైనందహతిపావకః
నచైనంక్లేదయన్త్యాపో। నశోషయతిమారుతః।
వాసాంసిజీర్ణానియథావిహాయ। నవానిగృహ్ణాతినరోఽపరాణి
తథాశరీరాణివిహాయజీర్ణా। న్యన్యానిసంయాతినవానిదేహీ"

అను గీతావచనంబులే దీనికిఁ బ్రమాణము :—

"చచ్చినవాని కేడ్చెదరు చావునకొల్లక డాఁగవచ్చునే?
యెచ్చటఁబుట్టె నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్."

భగవంతుని యుద్దేశము గొప్పది. మూఢమానవులకిది యెఱుంగరానిది. "సర్వము మంచికొఱకే" యను నార్యోక్తియందు నాకిప్పటికిని దృఢవిశ్వాసము కలదు. నా "ఆరోగ్యమాధవము" గాని తత్సంబంధించిన యాశీర్వాద పద్యములుగాని

మతెవ్వియును వ్యర్థములు గావనియే నాతలంపు. ఏలయన కోరి నంతమాత్రమున నాతనయున కాశీర్వాద పద్యములు పంపి నన్నోదార్చి దూరముననుండి తగు శ్రమవహించి లేఖలువ్రాయు మహాత్ములెవరు సిద్ధముగ నుందురు? ఇంత యనుగ్రహము నకుఁగారణము నాయందుఁగల నిర్వ్యాజకరుణయే కదా? సర్వదా శుభసూచకములు గలుగుటకు దీవించుట. పెద్దలధర్మము కదా? అంతమాత్రమున వాని ఫలితములకుఁ గర్తలు గారు కదా? ఆయువును వృద్ధిసేయ లేరు కద. అదియునుంగాక నాఁడు నా "ఆరోగ్య శతకములు" ఫలవంతము లగుటకు నేను గారకుఁడనని గర్వించుట ధర్మమా? అట్టులే యీనాఁటి కార్యభంగమునకును మేమెవరము కర్తలము కాఁజాలము. విధి ననుసరించి కర్మల నాచరించుటయే మానవుల ధర్మము గాని దాని కర్తృత్వము వహించుట కధికారము లేదు. సర్వమునకును గర్త యా లీలావతారుండగు జగదీశ్వరుఁడే.

భగవంతుఁ డిట్టి కష్టదశలో నుంచినాఁడని నిందించుట తగదు. మహాత్ములట్టు లాచరించినను దేవుని కది ప్రియంబేయగు.

ఆ. "అలుకనైనఁ జెలిమినైనఁ గామంబున
నైన బాంధవమున నైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁ డగు వారిఁ
జేరవచ్చు వేఱు సేయఁ డతఁడు."

క. "వైరానుబంధనంబునఁ
జేరిన చందనమునఁ విష్ణుఁ జిరతర భక్తిం

జేరఁగరాదని తోఁచును
నారాయణ భక్తియుక్తి నా చిత్తమునన్."

గర్భశోకముకన్న మానవుల దహింపఁ జేయునది వేఱొకటి లేదు. ఇట్టి కష్టంబులు మానవులకు వచ్చుట సహజముకదా? ధైర్య మిప్పుడే యుండవలయును. బంధు మిత్ర పుత్ర కళత్రాదులందఱును ఋణస్థులు. వారివారి ఋణములు తీఱిన వెనుక విడిపోవుదురు.

శా. "నీరాగారని విష్టపాంధులక్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు గూడివిత్తురు సదా సంఘంబు లేదొక్కచో

... ... ...

...తద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్."

"ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతా దయః"

ఔషధము లేకను, అన్నము లేకను మానవులు మృతిఁజెందుట లేదు. ఆయువున్న నెట్టిప్రతిక్రియలు చేసినను సఫలములగును. "ప్రతికారవిధాన మాయుషస్సతి శేషేహి ఫలాయకల్పతే."
ఏ సమయమున నే మానవుని కేది ఘటింపఁ జేయవలయునో యయ్యది దయ్య మెఱుంగు. ఏ వస్తువు; ఏ సమయమున నెట నుంచవలయునో యచటినుంచి సంరక్షించు భారమతనిదే.

శా. ఏ కాలంబున నే ప్రదేశమున నే యే సౌఖ్యముల్ దుఃఖముల్
లోకేశుండులిఖించు మానవుల కాలోచించి యాస్యంబు లం
దా కాలంబుననా ప్రదేశమున నా యా సౌఖ్యముల్ దుఃఖముల్
రాకేలాగున మానుభీతివడిన న్గవ్వంతయున్ దప్పునే?

విధి ననుసరించి మానవులు బాల్య, యౌవన, కౌమార, వార్ధక మరణావస్థ లన్నియును బొందక తీరదు. చేసికొన్న కర్మ యనుభవింపక పోదు. ఈ శరీర సంబంధ మంతయును నంటము కావలసినదే. దీనికై వగవఁ బనిలేదు. ఆపదలందున్న ధైర్య మే ధైర్యము. అదియే మానవ లక్షణము.

శా. "అంతా సంశయమే శరీర ఘటనంబంతా విచారంబె, లో
నంతా దుఃఖపరంపరాన్వితమె మేనంతా భయభ్రాంతమే
అంతా నాంతశరీర శోషణమె దుర్వ్యాపారమే దేహికిన్
జింత న్నిన్నుఁ దలంచి పొందరునరుల్ శ్రీకాళహస్తీశ్వరా!"

మ. "తనయుండంచునుదల్లియంచువరుసల్ దర్శింపనీ దేహముల్
జనునందాక నెయుండుఁగానిపిదపన్ సత్కృత్యదుష్కృత్యముల్
వెనువెంటంబడివచ్చుదానివిధముల్ వేమారుయోజింపుమో
మనమా! యేలవృధాశ్రమంబు? కనుమా మాయాపహారిన్
హారిన్."

కావున నెట్టులైనను నాకెన్ని కష్టములు భగవంతుఁడు కల్పించినను నేను వగవను గాని క్షణమందైనను నా నిశ్చల భక్తి వానిపై విడకుండునట్లు చేసి చివఱకు నా కనుకూలమా మేర్పఱచి, భగవత్సన్నిధానమునందు నన్నుంచి, తత్పాదార దంబుల సేవించు భాగ్యంబు నా కిచ్చి నా జన్మము ధన్యముగఁ జేయుటకై పరమేశ్వరుని బ్రార్థించుచుందును.

కాలము ననుసరించి ప్రకృతి ధర్మములు మాఱునట్లు కర్మ ననుసరించి ప్రకృతికార్య మీ విధముగ మార్పుఁ జెందినందులకు నింతగాథపెంచి వ్రాయవలసి వచ్చె.

రెండు వర్షముల ప్రాయము గల నా బాలుని కలమ్మున ప్రాయమించుకేనియుఁ గ్రైవాలమండఁగనె, మనోధైర్యమిచ్చి, యింతనీతి గ్రహింపఁ జేసి, సంసారగతులనిత్యములనియు శ్రీహరిచరణాబ్జ సేవనంబె కర్తవ్యమనియు గట్టిగ నా మనమున నాటి నన్నుఁ జరితార్థునిగఁ జేసిన భగవల్లీలలు చిత్రంబులనుటలో సందేహమేమి? కావున నా సుతుఁడు నాచే నింత ప్రయత్నము చేయించి, పుణ్యకార్యములొనరింపఁ జేసి, యౌవసాన దశలో మహాత్ములచే పద్యరూపమున దీవనలు బడసినందులకు, యీ పుణ్యకార్యము లన్నియు వాని కాత్మశాంతిఁ గలుగుటకై వినియోగించుననియు, ముందు నావంటి దరిద్రుని గర్భమునందుఁ గాక మహాపుణ్యాత్ముల గర్భమున నుదయించి సుఖించుననియు నేను నిశ్చయబుద్ధితో నమ్ముచున్నాను.

మ. మనమా! కుండెనుతాయి చేసికొని నైర్మల్యంబునుం గాంచి పు
త్రునకై చింతిలఁ బోకుమింక నలపుత్రుల్ మిత్రులాప్తుల్ మఱిన్
ధనధాన్యంబులు నీటి బుగ్గలవలెన్ మాయంబులౌ నింతలో
గనుమా! శ్రీహరి పాదపద్మములు వేడ్కన్ బూజలన్ సల్పుచున్.

# ఉపదేశము.



ఉ. పోయినవారికై వగవఁబోవనియేమి ? విషాదమొందుటల్
శ్రేయముగాదుధైర్యమున చిత్తముతద్దయుఁజిక్కఁబట్టుచున్
బాయుట ధర్మమాపదలుభద్రమొసంగెడు జ్ఞానమార్గమున్
బాయుటన్యాయమానె? మగువా!విలపింపఁగరాదుదీనికై. 1

చ. వగచినలాభమేమి? తనువానశియించునుభోగభాగ్యముల్
జగతిని నీటిబుగ్గ లను సంగతి నీ వెఱుఁగంగరానిదో ?
సుగములభింపనుబ్బుటయుశోకముఁజెందెడువేళఁ గుందుటల్
తగదు వివేకులేగెడు పథంబిది కాదు వచింపనేటికిన్. 2

మ. తరుణీ! యేటికినేడ్చుచుండెదవు చింతల్ గాంచి నిస్వేదుచున్
బరలోకమ్ముననున్న బాలునకునై భావ్యంబె శోకింప ? ని
ద్ధర నధ్యాత్మ రహస్యతత్వకలనాధర్మంబులన్ నేర్చి మో
క్షరతిన్గాంచఁగ యత్నమూనుమిఁక సాంఖ్యంబైన యో
గంబునన్. 3

ఉ. ఏటికి దుఃఖమొందెదవు ; యేగిన పుత్రునకై తపించి యా
రాటముఁ జెందఁబోకుమ నిరంతర మిట్టుల నేడ్చుచుండి న
మాటలనాలకింపుమిఁక మానిని! ధైర్యముఁ జిక్కఁబట్టుమా
దాటఁగ వచ్చునే విధివిధానము నేరికినైన నిద్ధరన్ ? 4

గీ. భువి నశాశ్వత మనఁదగు పుత్రమిత్ర
బాంధవ కళత్రములకయి వగచుచుండి
యా పరమజగదీశ పాదారవింద
భజనసేవ నాసక్తి వీడ్వంగఁదగునె ? 5

ఉ. ఆపదలెన్ని చుట్టుకొని యంతము లేక దహింపఁ జేసినన్
దాపముఁ జెందరాదు నిజధర్మముఁ బాయఁగరాదు భక్తి దీ
క్షాపరతంత్రులై సకల కారణకారణ భూతుఁడైన యా
శ్రీపరమేశ పాదయుగసేవ లొనర్పఁగ మోక్షమబ్బెడిన్. 6

గీ. ఎంత శాస్త్ర పరిజ్ఞాన మెసగియున్న
ధర్మనీతి ప్రబోధలఁ దఱచియున్న
సార్థకంబైన వైరాగ్య మబ్బకున్న
నాపదల నెట్టఁగాఁ దరమౌనె? కాంత! 7

చ. కలిగిన యంతలోన నుపకారము సేయుచు దీర్థయాత్రలన్
సలుపుచు భక్తకోటుల కజస్రము భక్తిగ సేవఁ జేయుచున్
మెలకువగాంచుచున్ హృదయనీరజమందు రమేశు పాదముల్
నిలుపుచుఁగొల్చుచున్ భువిని నెట్టుటధర్మము కాలమీగతిన్. 8

చ. వినయముఁ గాంచి పెద్దలనఁ బేర్మివహించి సధర్మపద్ధతుల్
పనివడిబట్టి దీనజనబాంధవులన్ దరిఁజేర్చి వారలన్
దనుపుచు దేవదేవుని పదమ్ము క్షణమ్మునైన బాయకుం
డినఁదుదిస్వర్గలోకమున నెట్టనఁగాంతురుసర్వసౌఖ్యముల్. 9

. మానవ జన్మమబ్బెనని మాటలు వేయి వచింప నేటికో
మానవతీలలామ! పరమంబగు మోక్షముఁ గాంచు పద్ధతుల్
మానకబట్టి జీవితములన్ వృథఁబుచ్చక జ్ఞానమార్గ దీ
క్షానియతిన్ జరించిన సుఖస్థితి కల్గును నిందునందునన్. 10

ఉ. జ్ఞానముఁ గల్గినందులకు గాలము వ్యర్థము సేయఁబోక యా
మానవలోక భోగముల మ్రగ్గక నస్థిరమైన వాంఛలన్

మూని తదేక నిష్ఠఁగొని మాన్యులఁగొల్చుచు దేవదేవునిన్
బూనినుతించినన్ గలుగు మోక్షమునిందునఁనందునన్ దుదిన్. 11

ఉ. వీరిని వారినిన్ గొలిచి వెఱ్ఱితనంబున దానసార సం
సారగతుల్ స్థిరంబు లని స్వాంతములోఁ దలఁపోసి జీవితం
బూరక కొంటుచుంటబుధులొప్పెదుకార్యముగాదుదైవమున్
వారక గొల్చినన్ గలుగవా? సురలోకనివాససౌఖ్యముల్. 12

గీ. ఇది సనాతన ధర్మము ; యిది యజ్ఞాన
మార్గ మిది యనీతిపథము మానవులకు
నిట్టి సూక్ష్మ బోధ లెఱుఁగ నట్టి మూఢు
లరయ నింద నందున భ్రష్టులౌదు రెపుడు. 13

